శ్రీశుభమస్తు.

# మౌనధారి

నాటకము.

గ్రంథకర్త :

నారాయణరావుపేట

పోలాసుదర్శనం

ప్రకాశకులు :

కొండా శంకరయ్య

పుస్తకముల వ్యాపారము మహాకాళివీధి సికింద్రాబాద్

బ్రాంచి:—మేన్ రోడ్, వరంగల్.

1952



వెల 0-12-0

—( శ్రీ శు భ మ స్తు )—

# మౌనధారి నాటకము

గ్రంథకర్త.

నారాయణ రావుపేట

పోలాస సుదర్శనం.



ప్రకాశకులు:

కొండా శంకరయ్య

పుస్తకముల వ్యాపారము

మహాకాళివీధి, సికింద్రాబాద్.

బ్రాంచి:- మెయిన్ రోడ్, వరంగల్.

1952



వెల 0-12-0

# ముఖ్యమైన పాత్రలవివరము.

—(✦✦)—

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| సూత్రధారి— | నటి— |
| మాణిక్యేంద్రుడు— | సుకుమారి—మన్మథుని తల్లి |
| మన్మథుడు—కథానాయకుడు | చెలికత్తె— |
| రత్నాకరుడు— | మానధారి—కథానాయకి |
| సిద్ధి రామలింగం శెట్టి— | మానధారి—మొగవేషముతో కనకాంగుడనే పేరు. |
| ముక్కిడి జంగము— | |
| చోరులు— | |
| శత్రుడు— | |

॥ శ్రీ శుభమస్తు ॥



# మౌనధారి నాటకము.

—(ప్రవేశము సూత్రధారుడు)—

॥ఉ శ్రీకల్యాణగుణాభిరాముఁడు ♦ ధరతీర్థజాత్మసంచారుడుఙ
పాకారిప్రముఖాదితేయవినుత ♦ ప్రాబల్యయుక్తుండున
త్కేకేయీవరపూరణుండువిపినా ♦ కన్త్రాణశీలుండుసు
శ్లోకుండీసభవారికోర్కెలలరఙ ♦ శ్రీరామునేగొల్చెదఙ॥

క॥ శ్రీరాజకృష్ణ పురీశ్వర
కోరినకోమట్లరెడ్డి కులజులకోర్కెల్
దీరగరారా రఘుకుల
వీరా శ్రీరామచంద్ర విజితకపీంద్రా॥

సూ-వ॥ ఆహా సంతోషము యీ సభామండలిఙ గాంచ నాహృదయంబున కెంతో ఆనందంబగుచున్నది. వీరలమనంబు సంతోషస్వాంతులజేయుటకు నా ప్రియకాంతయగు నటిని రావించెద॥

-(తెరవంక జూచి)-          దర్వు-ఆదితాళము.

కాంతామణినటిరావె । నాస్వాంతానందముదేవే । కుటిలకుంతలి నీరాకాగోరుచున్న । హాటముసేయకా నీవిటులవేగిరంబురాన ॥కాం॥ ఘల్లుఘల్లుమానికాళ్ల గజ్జలందియలుమోయ । కుటిలాముసేయాక యిటువేగిరంబురాన ॥కాం॥

సూ-వ॥ నటీమణీ ఒకసారి యిటురమ్ము నీకొరకై జనులంత నిరీక్షింపుచున్నవారు త్వరగరమ్ము.

వాదం – ఏకతాళము.

సూత్రి॥ రావెరావెఒక్కసారి రాకేందువదనీ ॥రా॥ నీవు జేయు కార్యమేమో నాతోనేర్పరింపుమరీ ॥రావె॥

నటీ॥ నను బిలచినకారణంబు నాథానాతోను దెలుపు॥న॥ వినియెద యాపనినాతో ఘనముదమున దెలుపవలయు ॥నను॥ పురుషు డెగతిసతులకూ। యీధరగలాపతివ్రతలకూ । ధవునియాజ్ఞ మేలూ । మావంటి వారికిబోలు ॥నను॥

నటీ–వ॥ నాథా నమస్కరించుచుదాన నన్ను రావించిన కార్యమేదో సూచింపుడు,

సూత్ర–వ॥ నటీ దీర్ఘాయుష్మవతీభవ ప్రేయసీ యీ సభామండలింగాంచితివా॥

సూ–గీ॥ లలిత యీసభగన కమ ♦ లాకరంబు
వందు విహరించు చక్రాంగ ♦ బృందమనగ
సకల కోవిదపుంగవ ♦ నికరములతొ
హృదయ వీధిని సంతస ♦ ముదయమాయె॥

సూ–వ॥ నటీ యీసభవారి మనంబు నానందింప జేయుటకై యే నాటకం బాడవలయునోయని నినురావించితిని.

నటీ–వ॥ ప్రాణేశ్వరా తాము యెల్లప్పుడు యేదోయొక యోచనచే కాలము గడుపుచుందురు అది యెట్లులన.

కం॥ యోగులకు బ్రహ్మమందున
ఈగెలకును తేనెయందు ♦ నిలకిస్తులకున్
భోగములందున దాతకు
త్యాగముపై చింతయుండు ♦ తమకేచింతో॥

నటీ–వ॥ నాథా యీరోజు మౌనధారి నాటకంబని ప్రమోదించిరి.

సూ–వ॥ యీ నాటకంబు యెవరిచే రచియింపబడినది గ్రంథకర్త నామాంకితం బెద్దియో తెల్పుము,

నటీ–వ॥ నాథా యీగ్రంథము చెల్లాపురంములహరి దాసుచేరచింపబడి కొండాశంకరయ్య పుస్తకములవ్యాపారం సికింద్రాబాదుగ్గారిచే ప్రకాశింపబడినది.

సూ-వ॥ నటీ చాల ఆనందభరితుండనైతిని కావున నొకసారి వసంతకాలమును వర్ణించుము.

దర్వు-ఏకతాళం.

సంతతసుఖకరముయీవసంతకాలము । నేనెంతనివర్ణింతును యీ వసంతకాలమూ । కాంతాజనములకుమదీకెంత మోదమూ । బహువింత వింతయానుమదీకెంత-చోద్యమూ ॥స॥ కలకలయని శుకపికములు బలుకు చుండగా । చెలగి తరులపై కోవెలల్ బలుకుచుండగా । వెలయగాను చల్లగాలి వీచుచుండగా। యిలనుస్త్రీలుపురుషులుబల్ వేడ్కజెందగా॥స॥

సూ-వ॥ నటీ చాలా ఆనందంబయ్యెనుగాన కాశ్మీర పతియగు మాణిక్యేంద్రుండు దర్బారుకు వేంచేయుగలడు మనము అంతఃపురము నకు పోవుదమురమ్మి. (నిష్క్రమింతురు.)



కాశ్మీర పతియగు మాణిక్యేంద్రుడు ప్రవేశము.

దర్వు-రూపకము.

మగధరాట్పట్టణము శుభమమంత్రి తెలుపుమా । మనికితంబు లేకనుయా। వనజోదరు సత్కృపచేతను మేలగుదురే మనుదురె ॥మగ॥ హితులు సతులు భృత్యతతియు గతులు దప్పకా చతుర్వర్ణాశ్రమధర్మ ।

హితులచె నొప్పుచునుందురె । ధృతిమతులై నిరతమును వెతలు లేక యుందురెకా ॥హి॥ శ్రీకరా రాజక్కప్యాటశౌరినిమిదిలో । నేసలచుచు మలహారాఖ్యా । ప్రాకటముగ స్మరియింతును ॥శ్రీ॥

గీ॥ సత్యవర్తనులయ్యి ♦ సకల జనంబులు
నున్న వార రుచిగ ♦ నున్న వార
సకలకార్యములందు ♦ సరణిదప్పక విప్ర
వరులు నున్న వార ♦ వాంఛతోను॥

వ॥ మంత్రీ మన రాజ్యంబున సకల జనులు బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్ర అష్టాదశ వర్ణంబులవారు సత్యమార్గంబు దప్పక యెవరెవరి కులాచార ధర్మంబున వారు మెలంగువారలా.

మం-ఉ॥ మననగరంబునన్ సిరులు ♦ మంజులనీతి ప్రభావనంబుచే
ననయము స్వచ్ఛబాహులిలు ♦ నంతట హెచ్చుగ నాల్గుజాతులున్
దినమున సంతసంబునను ♦ దివ్యయశస్కరులయ్యి నొప్ప యో
జనవరమీాదు ధర్మపరి ♦ పాలన చేతనెగాదె తల్పగన్॥

దర్వు-ఆది.

మం॥ ఈశావినువేగ మన । దేశాముున ప్రజాలును । నాసియును లేకా సర్వేశుని దలంతురు ॥ది॥ విప్రులు సదాచార మొప్పాగ జేయుచును । యెప్పుడుతమకై తాము తప్పులులేకుండను ॥ది॥ రాచవారెప్పుడు దాచాక శ్రీరాములు । నీచులగు రక్కసులపీచామణగింతురిల॥ది॥

మంత్రి వ॥ రాజోత్తమా మన పురంబునందలి జనులందరు యేయాపద బొరయకుండ సుఖముగా యున్నవారు దేవా.

మాణి॥ మంత్రివరా సభయొనర్చి సంతసంబునా । వింతవింతల వారకాంతల చెంతకూరప్పింపవలయు ॥మం॥ నాకవాసము రాగ నోరనేక విధములా । శ్రీకరముగశతమొనర్చెటి । లోకమేంచేసెటి భీకారతేజాడ ॥మంత్రి॥

వ॥ మంత్రీ యిా సభామంటపమునకు వేశ్య కాంతలను రప్పించుము గానంబు గావింపుము.

మంత్రి వ॥ మాణిక్యప్రభో చిత్తము యిప్పుడే రావించెద.

మా-వ॥ మంత్రీ నామనంబున నొక కోరికగలదు వినుము

దర్వు—జుల్వ.

ఓ మంత్రిసత్తమ నొకవార్తగలదు విను తెల్పెదా । కామినీ మణినాకాంతనుపుత్రిని । ప్రేమాచే బిలువాగ నేమంబు క్షేమంబు॥ఓ॥

వ॥ మంత్రీ అంతఃపురంబునకు జని నాభార్యయైన సుకుమారిని దోడ్కొనిరమ్ము.

మం-వ॥ దేవా చిత్తము తోడితెచ్చెదను.

మాణి॥ చిన్నవాడువిద్యలెన్నీ నేర్చినాడోవినియెదా । చిన్నారి పట్టినాడూ సన్నిధానంబు జేరి । కొన్నిరహస్యములు తెలున్న వెళ్ళనేడందూ ॥చిన్న॥

వ॥ మంత్రీ నా కొమారుండగు మన్మథుడు పాఠశాలయందు విద్యాభ్యాస మొనరింపుచుండెను పరీక్షించుటకై తోడ్కొనిరమ్ము.



—( ప్రవేశము-సుకుమారి )—

దర్వు—అటతాళము.

సుకు॥ సుకుమారినే । సుందరీమణులార ॥సు॥ నికరమూ నేలేటి మాణిక్యేంద్రుడునాభర్త । మకరకేతనూనిబోలుమన్మథుడెనాసుతుండు॥

సుకు॥ మాణిక్యపురీ । దీనజనులబ్రోచె జాణులమెకొమ్మా ॥మాణి॥

చానవాంతకూనిదలచూచుయే|ప్రొద్దు । నూనమూగాతుండా । పూని పనులుసేయు ॥సు॥ రాజకొక్కాపాట । సుజనమానసూని భజియించెద నమ్మా ॥రా॥ పూజితాకోమాల రెడ్డి పుణ్యవంశపరూల । రాజీవాక్షు డూను|బోవ నేభజియించెదనమ్మా ॥సుకు॥

చెలి-వ॥ అమ్మా మీవృత్తాంతం బెద్దియో వచింపుడు.

దర్వు-ఏకతాళము.

సుకు॥ ఇందూముఖి । విమలేందూముఖి । నాక్రమంబు దెలిపెద భ్రమనా । శమనా ॥యిం॥ సోమూనిగేరునా మోమువయ్యారంబు । భూమిలో వెతకిన । కామినిమణులును । నాసరిలేరే ॥యిం॥ మదనూనీ బంతీ । సొంపొదవగానుసుతునొదట జేరి ॥మద॥ పదవేబాలునిచదువు కనవలె । మేదీనిపతియిందుయేదారిజేరునో । క్రోధించునుపదువాదే లనుయిట ॥యిం॥ సరసీరుహాక్షి । నాతరమాపురిదొరజేరెటివేళ్ళ ॥సర॥ సారెకురాజకొక్కాపాట స్వామినిమనంబుదలచి । చేరుమా । కోరుమా । దూరమేలవలదు ॥యిం॥

మంత్రి-వ॥ అమ్మా సుకుమారీ రాజుగారి యాజ్ఞయైనది రమ్మా.

దర్వు-ఏకతాళము.

సు॥ నన్నుబిలచితిరెందుకు । త్వరవిన్నవించుడిక వేగమె|ప్రియు॥ నన్ను॥ నెన్నదైవమటంచునమ్మితి।పన్నగవినుసు|పసున్నడవౌ|ప్రియు॥ నన్నుబిలచిన॥

వ॥ నాథా నమస్కరించుచున్నదాన నన్ను బిలపించిన కార్య మెద్దియో వినగోరుచున్నదాన.

వాదం-ఆదితాళము.

మాణి॥ కువలయనయనీ । నొకసవినయమును సవినయమును వివరించెద|ప్రవిమలముగ ॥కువ॥

సుకు॥ భువిపతివినుమా । మీా స్తవమును । మీా స్తవమునునొన రించుచాన । సువివా_ర్తలుచెలుపుమయ్య ॥భు॥

మాణి॥ సుకుమారివినూ । మనమకరాంకుని మకరాంకునిసరియా మనమన్మథునకు పరిణయమునుగావింతము ॥సు॥

సుకు॥ ఇకరోూచనయూ । మనయినవంశుకు యినవంశుకులగ్నం బుకు సకలపదార్థంబులూను । సమకూర్చుడిసమయమూన ॥యి॥

మాణి॥ మేలాయెనికా । మనబాలునకును బాలునకును యీామా సహె పాణిగ్రహణము జేయగమేలు ॥మే॥

మాణి-వ॥ ప్రాణేశ్వరీ యిదియే మాసంబులో కొమారునకు వివాహంబు గావింపవలయు సకల సన్నాహంబులు యత్నింపజేయుము.

సుకు॥ చిత్తము ప్రాణేశ్వరా కొమారుని విచారించుము.

మాణి-వ॥ మంత్రి యిటురమ్ము పాఠశాలయందు నాకొమా రుండుగలడు తోడ్కొనిరమ్ము.

క॥ సచివా రాణి కుమారుని
　నిచటికి దోడ్తెమ్మటంచు నిదివర కేనే
　ప్రచురించినాడ నిక్కము
　ఖచితముగను డోడితెమ్ము కంజాతాక్షున్॥

వ॥ మంత్రీ త్వరగా బొమ్ము.

మంత్రి-వ॥ దేవా చిత్తము తోడితెచ్చువాడ.

—♦ ప్రవేశము - మన్మథుడు ♦—

దర్వు - ఏకతాళము.

మన్మ॥ శ్రీహరి కమలాక్ష । చిద్విలాసమిమ్మగొనియాడెదను ॥శ్రీ॥ వోహూలనుతుడా । నాదుస్నేహసఖు లెటు జనిరహూ ॥శ్రీ॥ మొద మొంద సభనుజేరి । నాదుప్రియుల వార్తదెలసి । యీాధరరాజక ప్యాట శ్రీధరునీ కృపను బడతు ॥శ్రీ॥

వ॥ బాలులారా బడిలోనుండి పంతులుగారి యాజ్ఞవడసి వచ్చి నారము మనమిపుడు ఆటలాడుకోవలయును రండు వనమునకు పోవు దము.



దర్వు - జుల్వతాళము.

మన్మ॥ బాలకులార పావడుడిక కేళీసల్పా ॥బా॥ అదో మరాళము నటునురికెనే । ఇదో నిదో పావురము నిటుజేరెనే । ఖగంబుజూడ పన్నగంబు బెదరెను । వగల్ రామచిలుకగోనటుజేరె । బుగులుజెందకండీ । యా మగులుయు నెక్కుడి । వాహావ్వా రారండి । తే తెండిపత్తూల॥ బాల॥ శ్రీకర రాజక్కప్యాట వాసునీకృప ॥శ్రీ॥ నేదలచూచుయిందూ ప్రావుగ జేరూవాడ । రాజకుమారయంచు । నాకేకలెల్ల వినుచు । ప్రాకటముగ రండుమలహారినీ కరుణచె బ్రోచ హారికై ॥బాలకు॥

వ॥ బాలులారా ఆటలు చాలించ వలయును రెండుజాముల వేళ గావచ్చినది రండు పోవుదము.

( మన్మథుండు తండ్రియొక్క సభంజేరి )

మన్మ-వ॥ జనక దేవా వందనములు సమర్పించువాడ.

మాణి-వ॥ కుమారా చల్లగా వర్ధిల్లుము యింతవరకు బడిలో నుండి విద్య నేమి యభ్యసించితివి.

మన్మ-వ॥ జనకా తర్కమీమాంసా వ్యాకరణ ధనుర్విద్యల న్నియు నభ్యసించితిని.

మౌని-వ॥ కుమారా యిక్కడికీవిద్యను చాలించి వివాహంబు జేసుకొనుము.

మన్మ-వ॥ తండ్రి యింత చిన్నతనంబున వివాహము మాడినచో నావిద్వత్తు నష్టంబుగాబోవును యింత తొందరేల.

వాదం - త్రిపుట.

మౌని॥ మదియిదియేరా । కుమారా । సదనా । యేసదనము లను దిరగియును । మదవతినిక సం । బుధజన సం । మ్మోదమున పరి ణయ మునుజేతును ॥మది॥

మన్మ॥ అదిసరిసరి నేమితొందరా । నాయన తగదు తగదూ ॥ అది॥ మదిజెడి పిన్ననాట లగ్నముచేతను । నాసద యత్నంబొదలియు దుర్మ్మదముకు హేతువనెకద । సుదతులెల్ల । చెదురజాల ॥అది॥

గీ॥ ఆడివారల గోరుట ♦ హానితండ్రి
యెన్ని సంవత్సరములున్న ♦ యమపురంబె
సుతుల బడయుట మేలేమి ♦ సుఖములేదు
యిహమునకుకీడె పరమున ♦ కింకకీడె॥

వ॥ జనకా వివాహంబు జేసుకొని పుత్రులగన్న ఫలమేమి యిహమందు కీర్తిలేదు పరమందు మోక్షములేదు వలదు నేలగ్నంబు నాడజాలను.

వాదం - ఏకతాళం

మౌని॥ హరిహరి కూడదూర । యిట్టివాచ । తరుణులు లేని గొప్ప । పరమపురుషార్థులైన । నిరువ్యసనముజెడి । గురిదప్పి మోహిం చర ॥హరి॥

మన్మ॥ తరముగాదయ్యస్త్రీలాదలువాతండ్రీ । గురిలేని వారలందు స్థిరమతి నున్నవార।పరిపరిమోహభ్రాంతి।పడకూడీ మోసమొందెదరు॥త॥

మౌని॥ ఆడివారాలులేని వారుగలరా । జోడు పక్షూల్కైన జూడు నాదుపుత్ర । వాడెదారీజనములు యీరేడు గుణంబేమని ॥ఆ॥

మన్మ॥ చూడుస్త్రీజోడుచేతా । మూఢులైరీ । కూడియుమోహావార్ధినడుచుచు మునిగిమునిగి । జాడదెలియూరు హరియె । తోడు బాయును జనక ॥చూ॥

మాణి॥ యెక్కడసమోనీమాట చక్కానయ్యా । చుక్కలరేడు మించు సుందరి వోమన్మథ । దక్కించుమాదువాక్య ధర్మంబుదప్పకను॥ యెక్కడ॥

మన్మ॥ నిక్కమె వినురాజక్కా । ప్యాటవాసునీ । పక్కిడాలూ వేల్పు భజియించెదనూ । మక్కువ మలహరి దాసుని బ్రోవ ॥నిక్క॥





అర్ధసీసం – వాదము.

మాణి॥ సఖయ లేకనురాజ్య పదవికిరాజత్వ ♦ మెటులననుసుజ్ఞాన సుగుణదీవ

మన్మ॥ రారాజులును ముందు రాజ్యభారంబొంది ♦ యేపట్టణము గొంచు నేగిరయ్యా

మాణి॥ యుభయ సుతులునున్న నీనూహ మెదులుదు ♦ ఇందె గాకతరువాత హేతువెటులా

మన్మ॥ యేరుదెంపగ చెట్టు కెన్ని ఫలములుగాయు ♦ ననుమాట బోచదా నాదుతండ్రి

మా॥ యతులు సాధులు ఋష్యాదు లెవ్వారైన
మన్మ॥ మతియుజెడి పూర్వవృద్ధిచే మాయుబడిర
మాణి॥ సతులు లేకను తపములు సలిపినార
మన్మ॥ అతివలనుగోర లాభంబు ననకుమయ్య॥

వ॥ జనకా ముందు రారాజులు రాజ్యపలిపాలనముజేసి సింహాస నము నెత్తిపై బెట్టుకొని పోయియున్నవారా నాకీ రాజ్యంబేల వివాహంబేల.

వాదం — రూపకం.

మాణి॥ పుత్రి సుజనామిత్రి మోహనగాత్ర । యేమిచిత్రమురా ధాత్రిరాజు నగరరాచ । ధర్మమెటుల । సతులునుండ యిహపరమును దెల్యరాద ॥పుత్రి॥

మన్మ॥ చిత్రమెమీర నేటివాక్యం । శతృత్వంబే స్త్రీలసౌఖ్యం । రాత్రిరాజువాసవుండు రమణుల చేతను । తనగాత్రము జెడియిహ పర భ్రష్టత్వం బొందలేదయిక ॥చిత్రి॥

మాణి॥ వంశమునకు హానిదేకు. । వలదురానాయాజ్ఞ దూరకు । సంశయంబు మానివనికి । సమయమందు శుభంబు పరిణయంబు గోరవలయు ॥వంశ॥

మన్మ॥ వంశముద్ధారణయుజేసె । వనితగలదు జగములోన । హంసయానల మర్మమూలు । అజున్నికైన దొరుకుట దుర్లభం తండ్రి॥ వంశముద్ధారణ॥

మాణి॥ తగిన స్త్రీని దెత్తుభోగ । యుగయుగములకీర్తిరాగ । పగనసీతో లేనివాక్కులు । పలుకుతాన భగవంతునిసాక్షి ॥త॥

మన్మ॥ నిగమవినుత రాజకన్యాట । నీరజోద్భవుతండ్రిమాట । యిగనుప్రతియు యేమనందు । యింతులట పతిభూషణ । మెంచుదురట హాహా ॥నిగమ॥

వ॥ జనకదేవా నొక్కమనవి నవధరింపుడు.

సీ॥ జనక నీవనువాక్య ♦ మునకు నే ప్రతిమాట
చెప్పవాడనుగాను ♦ జెందుటెటుల
వనితలు సత్యవాక్కులు ♦ నూటికొక్కరు
గలరెందుచూడుము ♦ కనులగాంచ
మొదలె స్త్రీ వలదని ♦ సదయ ప్రార్థించితి
వినరైతి రేమినా ♦ మనవి గనుడి

గీ॥ నైన నాకోర్కనొక్కటి ♦ నరవరేణ్య
సభలోమానము గాచెటి ♦ సత్యవతిని
పరిణయము గొందు మీావల్ల ♦ పాదుగాను
వెదకి మిమునను బ్రోచెటి ♦ వెలదినిటకు
దెచ్చెదను సెలవొసంగుడి ♦ నిశ్చయముగ॥

వ॥ జనకా సభలో మానముగాచి అత్తమామలకు కీర్తి వహిం చేస్త్రీని లగ్నమాడెద కావున నేనే చవ్వన్న దేశంబులు తిరిగి తేగలను యీకార్యము మీానుంచి కానేరదు నేబోయెద సెలవొసంగుము.

మాణి-వ। కుమారా నీవుబోయి అట్టిస్త్రీని వివాహమాడి వేగి రమ్మనిగ రమ్మి యిచట శత్రుబాధ మిక్కుటంబు గలదు.

మన్మ-వ॥ జనకా వేగిరంబున వచ్చువాడను నా అశ్వంబును చేతి ఖడ్గము బంగారి సందూకు నాకొసంగుము.

మాణి వ॥ కుమారా యివిగైకొని పోయిరమ్మి.

మన్మ-వ॥ ఆహా మానాయనగారితో సభలో మానముగాచే స్త్రీని దెచ్చెదనని పందెము బన్ని వచ్చితిని అట్టిస్త్రీ నాకులభించునో లేదో దైవమా.

దర్వు - ఏక.

మన్మ॥ నీరజేక్షణా । దారీజూపు నేగోరుకాంత । యూరాపేరు శీఘ్రింబునాతో ॥సీ॥ తగనీపందెమూ । గోడితిగనియా మగువెటులో । యీా యుగముల గలదోలేదో । భగవంత నీవెదిక్కు ॥నా॥

వ॥ హా దైవమా యిన్ని దేశంబులు చరించితిగాని యెచట లభించక పాయెను యింక తిరిగి చూచెదగాక.

దరువు - ఏక.

మన్మ॥ నగర నను జూచినా । యది మొదలు రాజులుసత్యులయిన వంజాతు లబద్ధులనియూ ॥న॥ వగచి వలదనినవినకత్రుడితో । వాదులాడియు తగిన కన్యను । తెగువతోడను దెత్తుననినా । మొగతనము నూర్కున్నగానీ ॥నగర॥ తిరిగెదను రాజక్కన్యాట యానరసిజోద్భవు చరణములకృప । తరుణి దొరుకక పోయితె మలహారి నిడచి పురముకు జేరబోవనూ ॥నగ॥

వ॥ హా పరమేశ్వరా మా నాయన గారితో పందెము జేసివచ్చినందులకు స్త్రీ యెచట లభించక పాయెను నాపురంబునకు యేముఖంబున బోవువాడ దేశాటనము చరించెద ఓహో యిచట సముద్రింబు తటస్థించెను యీసముద్రం బెట్లు దాటవలయును.

గీ॥ వినుసముద్రుండ నీకునే ♦ వినయమతిచే
దండమర్పింతు త్రోవివ్వ ♦ దయదలంచి
మార్గమునునివ్వు మళ్ళి మీ ♦ దుర్గములకు
జేరవచ్చెదకృపజూడు ♦ జనక దేవా॥

(సముద్రుండు త్రోవిచ్చును దాటె)

మన్మ-వ॥ ఓహో యీసముద్రింబు దాటివచ్చితిని యీవనం బెవరిదో యెంత అందముగా నున్నది.

దరువు - ఆది.

మన్మ॥ ఔరయీవనంబు గనుగొనగా । మహాభీకరంబునై మది వడంకగా ॥ఔ॥ శకుంతములకును సుఖంబు గలుగును । వికాసమును జేయు కాంతారమూ । బకూనందనం బనూ వెరువన । నికట సాటిగాదు కాంతులచే ॥నేడౌర॥ చారుతర ఖర్జూరములు । జంభీర చందననారికేళ ఘన సారసాదళి వారణామ్రగ । సారసకోరకములచేతా ॥నేడౌర॥

వ॥ ఈవనంబుజూడ నామనంబు ఆనందంబు గొల్పుచున్నది కొంతసేపు విశ్రమించెద. (అశ్వమును గట్టివేసి పండుకొనును)



—♦ రత్నాకరుడు - ప్రవేశము ♦—

దరువు - ఆటతాళము.

రత్న॥ సచివోత్తమా । ఉచితంబగు సద్వచనామృతమునువిను ॥స॥ ప్రచరింపుపరిపాలనచే । లాలనచే । సాచర్యులై । సోదరులైయుండురెవో॥ సచి॥ కుజనసంఘమూ । యీపురినుండగల రంతుజనులుయెవరైనగాని ॥ కుజన॥ ధరావెలయి అరప్పణముల్ ముఱయఁకొంచు నాతో । సరిగానూ నున్నార । యిరవూగ వీరందూను ॥సచి॥

వ॥ మంత్రీ మన రాజ్యంబునంగల ప్రజలంత సుపూజ్యంబైనొప్పుచున్నవారా.

దరువు-ఆట.

మంత్రి॥ మేదినిపరిపాలనా । తమరాజ్యమందు శుభ మోదమెల్లెడల ॥మేది॥ వేదపతినిమేచనిచూ సురులిలవాదుజేతురా । భార్గవుత్తోనృపు । లాధనంబునకు ఉత్తరేశుడూ । గాదు యందులావైశ్యవాహినీ॥ మేదిని॥ ప్రకటిత తమశాసనా । సద్భుతమనారవీపుత్రుడెరుంగును ॥ప్రక॥ తెలినాగమకలిమికీవంచన । గలిగించినసామీరివాహనము। బలముయెంతని తురగరాజ । కాల్బలముబలము సుగ్రీవుడెరుంగును ॥మేదిని॥

వ॥ రత్నాకర రాజేంద్రా తమ రాజ్యపరిపాలనంబునకు ప్రజలెల్ల క్షేమంగ నున్నవారు దేవా.

రత్న-వ॥ మంత్రీ నామనసందు నొక కోరికగలదు వినుము.

దరువు - రూపకము.

రత్న॥ వినుమంత్రివరా నాదుపుత్రి మానధారినీ। సుమశరసుం దారకారుడైన నొక్క మానవేశు। నూనుకొనగనెంచినాడ మానితం బుగా ॥విను॥ భూసురోత్తముచెజాబులు వ్రాసినొసగువారు సర్వ। దేశ పతులకిచ్చివారు భాసురంబుగా ॥ఘన॥ ధీరేంద్రపట్టణమూను శృంగా రింపజేయుమా। చారులానుదోలిబంధు వారము నరుదెంతురయ్య। వారునిల్వగారవముల। నెరూపాదింపూ ॥ధీరేంద్ర॥

వ॥ మంత్రీ శుభలేఖలు బ్రాహ్మణోత్తములచే పంపించుము మన వనంబునకరిగి పపాలకులవార్త నరసిరమ్మని నే దేవపూజకు వెళ్లు వాడను. మంత్రి—వ॥ దేవా చిత్తము.

(మంత్రి వనంబుజేరి మన్మధుని జూచి)

మం—వ॥ ఆహా యీ మహానుభావుం డెవరైయుండునో రాచపు త్రుండై కాబోలు యిప్పుడే వెళ్ళి మారాజునకు తెలియజేసెద.

(అని రాజువద్దికిం బోయి.)

మం—వ॥ రాజోత్తమా మన వనంబులో నొక రాచపుత్రుండు వేంచేసి పరుండియున్నవాడు.

దరువు—ఏక.

రత్న॥ ఎంతమేలాయె నాపుణ్యమేమందు యీధాత్రినీ ॥యెంత॥ కాంతుడుయెవరో ద్వీపాంతారమీవేల। వనాంతారమందు। సామం తూడై మేల్ ॥యెంత॥ నాచిన్నబాలయు నోచినఫలమేమొ। యీచిన్న వానికి నొసగూడుసరియైతె ॥యెంత॥

వ॥ ఆహా యీబాలుండు రాచపుత్రుండే నిద్రచేపరుండినవాడు మేలుకొన్నపిదప విచారించెదగాక.

మన్మ-వ॥ (లేచి దిక్కులుజూచి) ఆహావీరెవరు యీ యూరా మంబున ప్రజవరుండు గాబోలు యెదురేగి వందనము లాచరించెదగాక (యెదురేగి) దేవా వందనంబు లాచరించువాడ.



అర్థసీసం - వాదము.

రత్నా॥ ప్రతివందనము మీకు పట్టణమీ నామ ♦ మెయ్యేదో జనని
జనకులును యెవరో

మన్మ॥ మాణిక్య పురిదొర మా తండ్రి కాశ్మీర ♦ మహిపతి నా పేరు
మన్మథుడను

రత్నా॥ సరెను మంచిదిగాన సఖనీవు యిచ్చటికి ♦ రానుకారణ
మేమి దెల్పుమయ్య

మన్మ॥ సభలో మానముగాచె సతినిలగ్నముగోరి ♦ సతివలెచ్చట
లేక నిటకువస్తి

రత్నా॥ ఈప్రాంతమందున ఆపడతు లెందున ♦ వున్నరనగవింటి
వన్న తెల్పు

మన్మ॥ ఇందువున్నదటంచు వినలేదు కనలేదు ♦ గానినాప్రాప్తం
బు మానవేంద్ర

రత్నా॥ సరెను మంచిది మాదు పురికి బోదము పదుడి ♦ హరి
కృప నాకొక్క యుబలగలదు

మన్మ॥ పదుడి భూవరనీదు పట్టణము శీఘ్రంబు ♦ నీదుపుత్రిచె
నాస్థితి నుడువవలయు

రత్నా॥ దేవయీ తెరు వైన దివ్యంబుగాను ♦ కూర్చున్నదదుగో పట్టణముకువలయేశా

వ॥ మన్మథా రమ్మా పోవుదము. (రత్నాకరపురి జేరును)



—♦ మానధారి - ప్రవేశము ♦—

దర్వు - ఆది.

మాన॥ వోసాఖినా । వొయ్యారమమ్మా ॥వో॥ దేశాటనాము వెదకజూడరె । రాచాకాంతర్ । రమణీవినూ ॥వో॥ మానామమూ । మానధారియెకొమ్మ ॥మా॥ మాతోసమంబు లేరూయిలర్ । సూనాశరూసుమబంతినె ॥వో॥ క్షోణీలోనా । రాజశ్రీపాట ॥క్షో॥ నేనూ శ్రీహారినని ప్రాత్రినె ॥వో॥

చెలి-వ॥ అమ్మా మానధారీ నీస్థితిఁ దెలుపుము.

దర్వు-జుల్వ.

మాన॥ కాంభోజదేశా నివాసూలమె కలకంఠివినుమా మామది తేటగనుమా । అంభోజనాభూని హంసాజనె । అతివరత్నాకరునిఆత్మజనె । దంబమెలసరీ । నామంబు మానదరీ । కుంభినిః క్షత్రియులమిక

క్షేమంబుగోరెము ప్రజలకుమహా ॥కాం॥ అమరావల్లియు జనని యౌనో యమ్మా । అలవజ్రుడును అగ్రజుడు మాకుకొమ్మా । సమరసమేనౌనో సఖియ నీకౌనా । రామారత్ననగరి రాజూలమె ॥కాం॥

వ॥ సఖీ వనంబునకు బోయి ఆటలాడుకొని వత్తాము పదుము.

దరువు—ఏక.

యీదారినాడాగ । బోదాము వేగాము ॥యీ॥ యీయూదమై యాబాలనె । తడయాక బడయాక వెడలూదమా ॥యీ॥ యీవేళ్ళ వేడూక ।లీడేర వేగామె ॥యీ॥ పావ్వూరముల్ : బట్టావలెగ । వాడి బాడి తడయాక వెడలూదమా ॥యీ॥

వ॥ సఖీ రమ్మీ ఆటచాలించి గృహంబునకు బోవుదము.

రత్నా॥ అమ్మా మానధారీ యిటురమ్మీ.

మాన॥ జనకా వందనంబు లాచరించుదాన.

రత్నా-గీ॥ మాణిక్యపురి దొర పేరు ♦ మన్మథుడును
చూడసుందరుడు లగ్నంబు ♦ నాడలేదు
తగని కోరిక గోరియు ♦ జగతి వెదక
వారిమదితీరు స్త్రీలేక ♦ జేరెనిటకు॥

వ॥ అమ్మా సభలో మానముగాచి అత్తమామలకు కీర్తివహించే స్త్రీ గావలయునని విచ్చేసి యున్నవాడు వారింగాంచుము.

మాన-వ॥ జనకా విచారించెద నీ వంతఃపురంబునకు జనుము.

( మన్మథుని వద్దికిం జేరి )

మాన-వ॥ రాజచంద్రమా పదివేల వందనములు.

మన్మ-వ॥ సఖీ దీర్ఘాయుష్మతీభవ.

మాన-వ॥ ఆహా యీమన్మథుని సోయగంబు యెంత అందము యెంత చందము పీరునాకు తగుపురుషుడే.

గీ॥ సోయగంబున యువ్వన ♦ ప్రాయమున్న
భాగ్యమున్న నిరంతరా ♦ రోగ్యమున్న
విద్యలరువిద్య నైశ్వర్య ♦ మెంతయున్న
తగిన పతిలేక యున్న ♦ యిదంతసున్న ॥

దర్వు - ఏక.

ఆహా యీమోహన కారూని జూచినది మొదలు । మోహామ ధిక । మాయెనేడికా । యేమిసేతుహా ॥ఆహా॥ కమలములబోలుకన్ను లుజూచినది మొదలూ ॥కమ॥ చాలవేడూకా । లాయెనేడికా । యేమి సేతుహా ॥ఆహా॥ అలసుధాంశు సరిముఖంబు జూచినది మొదలూ ॥అల॥ భాసూరమూగ యీసమయంబున మోసపోతిహా ॥ఆహా॥

వ॥ యీ మోహనాకారుని విచారించెదగాక.



వాదం - ఆది.

మౌ॥ భూమీవతీ । యేమీస్థితీ । కామూకనూ దెల్పుడికా । నేమూమేమీ । ప్రేమతోడ దెల్పుసత్యమూ । నీనేమమేదో వినెద నిత్యమూ । సామూజ వరదూనికృపా । నీమదిలోగల కోరికా । నేమూ మేదో ॥భూ॥

మన్మ॥ ఓమగువా సభలోపలా । నామూనమూ । గాచెదవ । నేమూమిదీ । కోరినాను యిట్టివాక్యమూ । భూరికృపతోడదెల్పుసౌఖ్య మూ ॥ భామూరో నాకభయమివ్వు । ప్రేమూనిను పెండ్లాడెద నేమూ మిదీ ॥వోమగువా॥

మాన॥ నాతో॰మిాదు యాజ్ఞారీతి । ధాత్రీసభా మెచ్చాగాను । ప్రీతిచేత । గాతునయ్య నీదుమానము । నాచాతుర్యంబు జూడుదీ నము । యేతీరైన మిాకృపాయు । యేలీనవాడ । ననుగాంచు । నీతీ యిదీ ॥నాతో॥

మన్మ॥ మేలాయెను పరిణయంబు । బాలానిను చేకొనియెద లీలా తేలా । జాలిగలిగె నీదువాంఛచె । వెతలు చాలదొలిగె హరియు కృపచే । స్త్రీలెచట నావాచాకను కూలూలును దొరుకాకనూ । సీలా వినూ ॥మే॥

మాన॥ హారామిదే మెడవేసెద । రారమ్మిటు మన్మథుడ । కోరినావా । బ్రోవదల్వనిదేభారము । పూర్ణభావమిదె సువిచారము నారీకినీభర్తవయ్యి । జేరితివీ మాపురంబు దూరోబోకూ ॥హారా॥

మన్మ-వ॥ ప్రాణేశ్వరీ మనమిరువురము హర్షమొందితిమి మిా నాయనగారియాజ్ఞవడసి మాపురంబునకు బోవుదమురమ్మ.

వాదం - ఏక.

మన్మ॥ మామమాకాజ్ఞివ్వుమా । యీకోమలిమణినిగొంచుబో దువో ॥మామ॥ నామిాదనునీ ప్రేమచేత । యీబాలామణినీనొసగీ । తమ ప్రేమయుంచు పెంపొసగీ । మాభూమికిరానేమముదప్పక ॥మామ॥

రత్నా॥ ప్రేమనాబాలామణికి । భూమిాశ్వరమరుచుండవలదు బహు ॥ప్రేమ॥ యేమాత్రము యేయుక్తులుదెలియని । బాలామణినిక బ్రోవుమా । తమనామముబాగడెములావుా । వోమహాత్మమిా క్షేమము బంపుడ ॥ప్రేమ॥

మన్మ॥ సఖమిాజనకునకివ్వుడు । జనుదునంచు సెలవొందితెలువు వో ॥స॥ వికలమానసమునొందనేల । మననికరముబోదమువదవె । వో శుకవాణిరొసాంపొదవ । మకరాంకునిబారికితాళనువో ॥స॥

మాన॥ ఇకయోచవనాయిన్నరో । మాణికవురిదొరవదుమనెతన పురికిని ॥యిక॥ సకలావస్థలానొందబోకుమా నికరముబోదునుసెలవా । మిాముఖముమళ్లిజూపవా । వొకనాడైననునికమరువనువో ॥యిక॥

రత్నా॥ అమ్మనినుమరచుటెట్టులా। యిమ్మహినుందునుపొమ్మన జాలను ॥అమ్మ॥ ఇమ్మహిలోనీభర్తజేర నేమమ్ముగజరుపుమాయమ్మ। నీవు సమ్మతిమెదలుమునుమ్మా। పొమ్మకీర్తి దేవమ్మమాకువో ॥అమ్మ॥

మన్మ-వ॥ మామగారూ సెలవొసంగుము యిదే నమస్కరించు చున్నవాడ.

మాన-వ॥ జనకాపోయివచ్చెద దయయుంచుము.

రత్నా॥ మన్మథా అమ్మాయియా పోయిరండు.

మన్మ-వ॥ ప్రాణేశ్వరీ రమ్మ యీ యశ్వంబుపైనను గూర్చొ నుము.

మా-గీ॥ నాథనీవుండతురగంబు ♦ నెక్కనేల
నగరదేవతు[illegible]నయా ♦ నరులునైన
నీవెగూర్చుండుమీ వెంట ♦ త్రోవనడతు
పోవముఖ్యంబు మన్మథా ♦ ప్రొద్దుజనునూ॥

వాదం - ఆట.

మన్మ॥ పదుమామన గ్రామంబుకు। విధికృపయిక చింతేలను। సదయురాలా। సరసురాలా। బెదరాకుమిబెబ్బులులును మదనూకేళిచె నాటలు। నదుగోచూడూ। నహాహానేడూ ॥ప॥

మాన॥ హృదితాపము దీరె మనసదనామునుత్రోవగను। మృదు శరీరా మోహనాకారా। పొదలలో మృగములును। బెదరీబొంబొమ్మా నుచు। వదురసాగె। వనముదాగె ॥హృ॥

మన్మ॥ కొమ్మాబొడ్డుమల్లె వృక్షంబులదో, పొన్నలును సమ్మతె నా। యిమ్మహినా। కమ్మవిల్తుని కేళికి బొమ్మనిను గోరితిని। నమ్మి రావె। పాపమ్మిపావె ॥కొమ్మ॥

మాన॥ సమ్మతెటో వృక్షముల। గుమ్మగుమ్మని పుష్పము। లమ్మతెమ్మ। నమ్మినుమ్మా। పమ్మితామాల చెట్లమ్మలలో శయ నింతమ। నమ్మినావా। నన్నుబ్రోవా ॥స॥

మన్మ॥ కోరెదను చెక్కిలిని గోరెదను యిటకునీవు జేరినారీ। మానధారీ। సారమగు ఫలమూలదో। నోరాడదు భక్షించక। కోరితిన నిను జేరితిన ॥కో॥

మాన॥ హారమిదే మెడనువేసెద రారమ్మిటు మన్మథుడ। కోరినావా। నను జేరినావా। ధారుణిలో రాజకన్యాట హారికృపచే నిక దీరదేమీ। భ్రమయూ దేమీ ॥హార॥

మన్మ-వ॥ ప్రాణేశ్వరీ నాకు నిద్ర వచ్చుచున్నది కొంతతడవు నిద్రించెద పుష్పంబులు ద్రెంచి పాన్పు గావింపుము.

దరువు — ఏక.

మాన॥ బల్ విధమైనా। బల్ మోహమైనా యీపూల పాన్పునా శయనించు మోహన। నాదుమోహన శృంగార మోహన ॥బల్॥ మోహనాకారా। సుందరరూపా। మోహంబులెడ బాయజాలరా నీపైని ॥ విధామైన బల్ ॥

వ॥ ప్రాణేశ్వరా పడుకొనుము నీపాదసేవ యొనర్చెదానను.

దరువు—జుల్వ.

మాన॥ సేవజేసెదా। యీమృదుగాత్రుడుయానందించగ ॥సేవ॥ భావాము నీపాద పంకేరుహామూలపై। నేయుంచెద। గావించెద ॥సేవ॥ పడుకొనుంటివా। నాప్రాణనాథ దేహంబునలసి ॥పడు॥ విడువజాలనయ్యో గడియనిన్ను బాసిదేవ। లేవులేవుమా। ననుగనుమా ॥పడు॥ చుక్కలాదోరా। కళలన్నిబాయె దేహకాంతులణగె॥చు॥ నిక్కమూ రాజకన్యాట నీరజోద్భవుని దలతు। వెక్కసమా మలహారినిబ్రోవ। లేవులేవు మానను గనుమా ॥సేవ॥

మన్మ-వ॥ ప్రాణేశ్వరీ తెల్లవార వచ్చినది పదుము పోవుదము.

(కొంతదూరము నడచి)

మన్మ-క॥ ఓ మానధారి వినుమిక
నామానస మంచుయేమొ ♦ నాకెనునొకటి
యేమాత్రమైన దేహము
భూమిన్ గిరగిరను దిరుగ ♦ బూనెను చెలియా ॥

వ॥ ప్రాణేశ్వరీ నా దేహము తడబడుచున్నది. నేత్రములుచీకట్లు గ్రమ్ముచున్నవి యిది యేమిచిత్రమో కదా.

మాన-గీ॥ ప్రాణపదమ యీచిత్రము ♦ కేను యేమి
జేతు దేహంబు తడబడె ♦ హేతు వేమొ
పైత్యమో నిద్రభంగమో ♦ పరగ క్షుధయొ
యెటుల దోచదు నామది ♦ కుటిలమేమొ ॥

వాదం - ఏక.

మన్మ॥ జలజాక్షీ । యికయేమి సేయూదువో ॥జ॥ నళిన సంభ వుండుయిట్టి సమయమునక్ మోసపుచ్చె । ఫలంబు లారగించ క్షుదయు దీర దేమనందునికవో ॥జ॥

మాన॥ యిలనాథా । యికయెట్లా నయ్యెనో ॥యి॥ ఫలము తేనెలనుభవమా । కలిబాధకు తాళవేమి । యేస్థళమున పురమెటుగల దో నిలువునిలువు తొందరేలనికవో ॥యి॥

మన్మ॥ తలోదరీ । ఫలమేమో తెల్యరాదుగా ॥తలో॥ సరసి జాక్షి యీపురమున కరిగి సాయిత్యంబు గనుగొని తెచ్చెదనికవో ॥త॥

దర్వు - రూపకము.

మాన॥ రూకాలు లేనిదియూ । యేకోమటి యేసాదయు । ఓ కాంత నీకొసగును । నీకోరిక లేమొ తెలుపు । నిచ్చెదనిక వేరేమి । సుచరిత్ర నుడువుసుమ్మీ ॥రూ॥

మన్మ-వ॥ ప్రాణేశ్వరీ మనవద్ద నగదు రూపాయలు లేకపోయె నీవనుమాట నిశ్చయమేగాని వినుము నేనొకటడిగెద.

మన్మ॥ వోకాంత వజ్రంబుల వన్నెలుగల చీరొకటీ । ప్రకట ముగ ముత్యంబుల పసిడిరవికె నిటుదెమ్మీ । రాజక్క-ప్యాట వాసు తేజమివ్వ బోవవచ్చు ॥వోకాంత॥

మాన-గీ॥ నాథనీకన్న నెవ్వరున ♦ ప్రీతియేమి
యిదుగో ముత్యాల చీరె ♦ పచ్చింపు రవికె
గొంచుబోవమ్మ నిచ్చెద ♦ మచ్చికలర
శీఘ్రముగ రండు తాళను ♦ చింతగల్గు॥

వ॥ ప్రాణేశ్వరా యీ చీర రవికెల గొనిపోయి యెవ్వరివద్ద నైన కుదువగనుంచి తగు సొమ్ముల కొని తెమ్ము.

మన్మ-వ॥ ప్రాణసఖీ నేవచ్చునంతవరకు యీకోలనువద్ద అశ్వంబును బంగారి సందూకను గాపాడుకొని యుండుము.



—♦ కోమటి సిద్ధిరామలింగము ప్రవేశము ♦—

దర్వు - ఏక.

సిద్ధిరామ॥ శంకర పాహిమాం । శంభో త్రిపురాసురహార ॥శం॥ పంకజనాభనుతా । పరమానందయోగ్యా ॥శం॥ వైశ్యకులంబూ మాదీ । విశ్వమందూ । పైసతో కారాణంబూ బ్రహ్మాదులైన ॥శం॥ సిద్ధిరామా లింగమనె శెట్టినీ నేనూ । యీధరణిలో జప్పాలిచ్చెవప్పూనీ ॥శం॥ లేదా రాజకొప్పాటా వేసవెద్యూనికృపచే । దాసుడో మలహారినీ । పోషింపుమాయనీ ॥శంకర॥

వ॥ ఒరే నౌకరులారా శాకీలవారలు యెవ్వరైన వచ్చియుండిరా.

భటు-వ॥ శెట్టిగారూ యెవరూ రాలేదు.

గీ॥ ఒకటినిచ్చియు పద్దులూ ♦ నొనర రెండు
వ్రాసుకొనియిచ్చు వటిలో ♦ దోచుకొనుదు
వరగ తక్కళ్ళగాళ్ళ ♦ వాసంగమూల
కొలతలోనైన జూపవలె ♦ కులమురీతి॥

వ॥ నౌకరులారా మనకు రూకలు నిచ్చువారెవరైన వచ్చిరేని నాతో దెలుపవలయును.

(మన్మథుడు చీర రవికె తీసుకొనివచ్చి)

మన్మ-వ॥ అయ్యా యీపురము నామాంకిత మేమి.

భటు-వ॥ ఇది కనకాపురియను పట్టణము.



దర్వు - జుల్వ

మన్మ॥ ఓయీసావుకార్లు వాసరొప్ప చీరరవికె ॥వో॥ మీ వద్దనుంచుతాను సాయిత్తే మీనగదరక్కు ॥వోయి॥

సిద్ధి॥ న్యాయమాయిటువలెనే । యాచీర కంచుకముకూ ॥న్యా॥ వోయయ్య నవుదయిపుడు నొసగువారెవరూవామ్మి ॥న్యా॥

మన్మ॥ బీదావాడాను శెట్టియేదైన కొద్దిదినుసు । లేదాన కుండ నివ్వు నాదారిద్రింబుబోవు ॥బీదా॥

సిద్ధి॥ ఏవోయి చీరరవికె లెన్నడు గొంచుబోతా ॥యే॥ మేదీని మెచ్చసాదా నీదాయ నిత్తుపటుమీా ॥యే॥

మన్మ॥ ఆరుమాసములాను యీాచీరరవికెల ॥ఆ॥ కోరిన ద్రివ్య మిచ్చి కొంచూబోదూను శెట్టి ॥ఆ॥

సిద్ధి॥ లేదారాజక్కప్యాట వేదా వేద్యూనికృపచే ॥లే॥ పాదుగా మలహారాఖ్యు ప్రిస్తుతి జేసెద ॥లేదా॥

( చీర రవికల దీసుకొని )

గీ॥ అహహా యీాచీరరవికె ♦ లద్భుతముదోచ
మోసపుచ్చెదవీడు ♦ వుపాసముండ
యిట్టిచీరయు గట్టెటి ♦ పట్టియెవరొ
యెట్టులున్నదొ విడువనే ♦ నిటకుదెత్తు॥

వ॥ బాటసారీ సీవొక్కడవేనా లేక యెవరన్న వున్నవారా.

మన్మ-వ॥ శెట్టిగారూ నాభార్యను ఒక అశ్వమును యీాకొలను సమీాపమున నుంచివచ్చితిని.

శెట్టి-వ॥ అయ్యా బాటసారీ మీాకు తగురీతి సాయిత్యం బిచ్చెదను కూర్చుండుము.

గీ॥ శాకములు తోటఃకుదోలి ♦ తెచ్చెదనుక
నుండుమీా బెండకాయయూ ♦ ఖండశర్క
రయును దెచ్చెద రిపుఘనతి ♦ మోాదముననను
వచ్చెదరు తొందరేలను ♦ మచ్చికలర॥

వ॥ బాటసారీ శాకంబులకై తోటలోకి తోలించినవాడ గడియ తాళుము.

( శెట్టి నౌకరులను బిలచుకొని )

శెట్టి॥ ఒరే నౌకరులారా యీాకొలను సమీాపంబున ఒక స్త్రీయును ఒక అశ్వంబును గలదట యీాచీర రవికెల నానవాలుగా జూపించి నీమొగడు మాయింటి కడపదాకిపడి ఆయాసపడుతు వున్నవాడని మన పెరటిగుండా తోడుకొని రమ్మి.

( చీర రవికెల నిచ్చును )

భటు-వ॥ శెట్టిగారూ మీారు జెప్పిన ప్రికారము తెచ్చెవాడ.

( మానధారి వద్దికిని వచ్చి )

భ—గీ॥ అమ్మ యీచీర రవికెలీ ♦ వానొ చెల్వ
నీ మొగడు కాళ్ళువిరిగి మా ♦ నికరమందు
బడియు నున్నారు యివిసాక్షి ♦ బంపినాడు
రమ్మ పోవుదము తడవేల ♦ రాజివాక్షి ॥

వ॥ అమ్మా నీభర్తాలుండు జీవించేఅట్టులేదు నిన్ను వేగిరముగ దోడ్కొని రమ్మని తోలించినవాడు.

మాన-వ॥ హా దైవమా ఇక నేనేమిసేయుదాన.

( అని మూర్ఛిల్లును )

దర్వు - ఏక.

మాన॥ దైవమా నీవెదిక్కుమాకు । దరియు జేర్చుమా ॥దై॥ ముగ్గురు మూర్తులార ముఖ్యమేనమీాకు । భవునిరాణి భారతిరో । పద్మనాభ పడతిరావే ॥దై॥

గీ॥ అయ్యయో యెంతపనిగల్గ ♦ నాయనయ్యొ
పదుడి నాపురుషుడున్నయా ♦ పట్టణముకు
యేమిసేయుదు దైవమా ♦ యిపుడునేను
అన్నలార నా మగనిజూ ♦ పన్నలారా ॥

వ॥ అన్నా పదుము పోవుదము.

భటు—వ॥ అమ్మా యదియే గృహము నీవిచటుండుము.

( పెరటిగుండా తీసుకొని పోవును )

భటు-వ॥ శెట్టిగారూ అట్టిస్త్రీని యిటకు తోడితెచ్చితిని.

శెట్టి-వ॥ సేవకా తోడ్కొసి వచ్చితివా యీబాటసారిని ఆవలికి బారదోలెద. (మన్మథుని వద్దికివచ్చి బాటసారీ యిదిగో నీకు తగురీతి సామగ్రి పటుము. (సామగ్రి యిచ్చి వెళ్ళగొట్టును)

(సామగ్రి తీసుకొని కొలను సమీపించి)

మన్మ-వ॥ ప్రాణేశ్వరీ ప్రాణేశ్వరీ మానధారీ యెందుబోయితివి.

దర్వు - రూపకం.

మన్మ॥ తరుణిందులేదూ । తురగము జాడలేదూ । హరిహరి సఖలేనీ అన్నంబులేలా ॥తరు॥ ఆకలి హెచ్చెదారిద్రంబుజొచ్చె । మా



కాంత నెడబాసీ మనసేమొ నొచ్చె ॥త॥ సభలోమానంబూ సతియూ నేమంబూ । విభవాము లెటుబాయె శుభమూలుకంటీ ॥తరు॥ రాజకన్యాప్యాటా శ్రీరాజీవనేత్రా । నామానధారినీ ననుగూర్చు దేవా ॥త॥

వ॥ హా ప్రాణసఖి మానధారీ యెందుబోయితివి నీవులేనిది యీ సాయిత్యంబేల యీావన్నెలేల యీావస్త్రంబులేల.

దర్వు-ఆట.

మన్మ॥ ఇనా కేల సంసారరాజ్య సుఖమనుభవమును । నాచెలి యుఖ లేనుగా ॥యిక॥ యికనేమి సేయూను యింతిలేనీయీ మాహా సొగసెందుకూ । వికలమాయె మది శుకవాణియులే కొకదిన మైనను సకలములేల ॥యిక॥ యికనాతండ్రితో నాడిన మాటలు । తీరునాయె । నాతరుణెటుబాయె ॥నాచెలి॥ ధన్యులు మెచ్చ నేసన్యాసినయ్యేద । కన్నీయనూ గూర్చుకమలాసనా । రాజకన్యాప్యాట వాస నా జీవితేశ్వరీ । యేజాడ నున్నాదో । యేమీసేయుదు ॥నాచెలి॥

వ॥ ప్రాణేశ్వరీ నీవులేనిది నాప్పురంబున కెళ్లు బోవువాడ సన్యాసినై చరించిన దే మేలు. (సన్యాసి వేషముతో వెళ్లును)

మాన-వ॥ శెట్టిగారూ నాభర్తాలుం డెందు యున్నవాడు.

శెట్టి-వ॥ ఏమీ నీభర్తాలుండా నాకన్న వేరే నీకు భర్తాలుండు గలడా.

మౌన-వ॥ హా దైవమా యీకోమటి నన్ను మోసగించుటకై తెచ్చినవాడు వీనికి తగురీతి మాటలాడెద. (శెట్టినిజూచి) శెట్టిగారూ యిటుల భాషించుట మీకు ముఖ్యమా.

అష్టసీసం - పాదము.

శెట్టి॥ బీదవానినిగూడి బట్టలున్నిక బ్రతుక ♦ మేలౌన వోసఖి లీలవినుము

మౌన॥ నిజము కోమటిశెట్టి నీమాట నమ్మెద ♦ బీదవానితో పొందు పనికిరాదు

శెట్టి॥ సఖనన్ను గూడుమా వికల మొందకుమది ♦ కోరినద్రవ్యంబు నిత్తునీకు

మౌన॥ సరెమేలె వరలక్ష్మి సఖవ్రతము బూనితి ♦ ఆరుమాసములునా యాజ్ఞనుండు

శెట్టి॥ సఖియవ్రతదీక్ష యావల జెప్పినట్లు ♦ వినగలవ పనులు యేమేమొ ముదముతోడ

మౌన॥ దినము పదివేల వహాల నేమ్మమిదియు ♦ ధర్మమర్పింతు పూజకు తగిన విప్ర

వ॥ శెట్టిగారూ మీరునాకు యెన్నడు లభించగలరని నీవరలక్ష్మి వ్రతము బూనియుంటిని నేటికి నాకోరిక లభించినది యీ వ్రతదీక్ష యావల నీ వశురాల నయ్యెద,

శెట్టి॥ ప్రాణేశ్వరీ నీ కెంత ద్రవ్యము కావలయునో అంతద్రవ్యము పంపించువాడను వేగిరముగ వ్రతమును ప్రారంభించుము.

మౌన-వ॥ శెట్టిగారూ వేరెయొక నూతన గృహము నిర్మింప జేయుము.

శెట్టి వ॥ నీయాజ్ఞా ప్రకారము నిర్మింప జేసెద.

( నూతన గృహంబుననుండి )

మౌన క॥ వరలక్ష్మి దేవిమీ

చరణంబులె నమ్మినాను ♦ నామదిలోనఙ

పరమేష్టి జనని నాపతి
కుదురుగ దిక్కయ్యిబ్రోవు ॥ మమ్మా కొమ్మా॥
దర్వు - ఏక.

మాన॥ శౌరి మనోహరిందమరావా । వాక్కుసారీ నన్ను బ్రోవ॥ శౌ॥ శూరాసుందర మృదుశరీరా । మాంపాహిదాయి । యేరీతి నైన పతినిజేరా । మిమ్ము గోరితి । గూర్పుసువిచారా ॥మిమ్ము॥ మారాజనక మోసమాయె నామగడెందు బాయెనయ్యో ॥మా॥ కోరిసభలోమాసంబు నారిగాచెదవాని । జేరియు మోసపుచ్చిపాయె । భర్త జేరేదెన్నటికో తెల్పదాయె ॥భ॥ రాజక్కప్యాటవాసరారా । యీరమణీ మొరాలకించి ॥రా॥ నాజీవితేశ్వరూని వోజగదీశయిటకు। యేజాము కైన దెమ్ము దేవా । మిమ్ము పూజింతు మిమ్ముల గోపాలా ॥మిమ్ము॥

వ॥ ఓ వరలక్ష్మి దేవతా నాపతిని నాకన్నులకు నగుపడునటుల జేయుము నీకిదే నమస్కరింపుచున్న దాన.

శెట్టి॥ ఓ సఖిమణీ వ్రతంబు దీరినదా నాప్రాణము నిలచునట్టుల లేదు. వాదం.

మాన॥ మేలొందితిమీందుకృపచె చాలగా శెట్టీ। పాలించేటిలక్ష్మి వ్రతమూ । భక్తియూగట్టీ ॥మే॥

శెట్టి॥ వాలాయమూనన్ను గూర్చి వాంఛ చెవ్రతమూ । బాలామణి సేయుమింకభక్తితోనిజమూ ॥వా॥

మాన॥ సరెవింటిసీమీకృపచే సౌఖ్యమూకోరకె । సిరిదేవినీ గూర్చితపమూ । జేతుయిదువరకె ॥సరే॥

వ॥ శెట్టిగారూ యిదివరకు మూడుమాసంబులు గడిచినవి యిక మూడుమాసంబులు కావలయును.

( మన్మథుడు సాధురూపముతో )

దర్వు—రూపకము.

మన్మ॥ క్షుధబాధచేతా । తరుణినొదిలెవిధమునాయెగా । మద వాతికయ్యో తిరిగెదాను । మమతదీరగా ॥క్షు॥ పట్టాణమెవరిదో నొతెలియ భ్రాంతిచిత్రమూ । యెట్టూలనైనసాధునైతి వెలదియత్నమూ ॥క్షు॥

వ॥ ఓహో యీపట్టణము యెవరిదైయుండును యిచట దేవాలయము యగుపడుచున్నది కొంతసేపునిద్రించెదగాక.

(అని పండుకొనును)





—( బ్రాహ్మణులు ప్రవేశము )—

బ్రా-వ॥ ఒరే రామంభట్లూ కనకాపురంబులో కోమటి పోలిశెట్టి కోడలు వ్రతంబు జేయుచున్నదట సంభావనదొరుకుతదట రమ్మా. (మన్మథుని జూచి) ఓ సాధుపుత్రా యీ కనకా పురంబులో సంభావన దొరుకుతది రమ్మా పోదాము.

(అని లేపుకొని పోవుదురు)

బ్రా-వ॥ అమ్మా బ్రాహ్మణోత్తములము వేంచేసి యున్నారము.

మౌన-వ॥ బ్రాహ్మణోత్తమా వందనములు సాధుపుత్రా వందనములు.

సాధు-వ॥ అమ్మా ప్రతివందనములు.

మౌన-వ॥ ఓహో నాభర్తాలుండు నాకొరకై సన్యాసి వేషము ధరించినవాడే యిపుడేమనిన వ్రతభంగము కాగలదు. కనుక నొక యుక్తి జేసెద.

క॥ ఒక కాగితంబు ద్రవ్యము
నకునుంచియు మూటగట్టి ♦ నాత్మేశునకున్

నికనొసగెద నది జదివిన
సకలావస్థలును దీరు ♦ సౌఖ్యము గలుచుర॥

వ॥ ఒక చీటివ్రాసి ద్రవ్యములో మూటగట్టినిచ్చెద ఆకాగితము చదువుకొని నాజాడకు రాగలడు. (బ్రాహ్మణుల జూచి) ఇదిగో మీకు సంభావన నిచ్చుదాన సాధుపుత్రా యిదిగో యీమూట బట్టుము.

సాధు-వ॥ భూసురోత్తమా యీమూటలో నేమి యున్నదో విడచి చూచెద. (అని విప్పును)

గీ॥ మూటవిడచితి యీచీటి ♦ మాటయేమి
పారవేసితి బ్రాహ్మడ ♦ పటుము ద్రవ్య
మిదుగో మా కేల కోమటి ♦ యింతసొమ్ము
గొంచుబోవయ్య వరహాల ♦ సంచిమూట॥

వ॥ భూసురోత్తమా యీద్రవ్యము నా కేల పటుము.

(చీటినిపారవేసి వెళ్ళును)

ముక్కిడి జంగము. దర్వు - ఆట.

జంగ॥ జ్ఞానప్పనూ । జంగము జ్ఞానప్పనూ । సిద్ధిరామప్పనూ । శివలింగప్పనూ ॥జ్ఞా॥ యెక్కడబోదూను భిక్షమెత్తపదము బాడరాదు। ముక్కుబోవ చక్కదనము మణిగిపాయె హరహరహరహర ॥జ్ఞా॥ యీ కోమటి వాకిటిలో వొక్కకాగితమూ నున్నాది । యెక్కడిదో చదివెద రాజక్కప్యాట వాసుని భజనా ॥జ్ఞా॥

వ॥ యీచీటి నోటా? ఆంకడనా? వుత్తరమా చదివిచూచెద.

గీ॥ ఎవరొ స్త్రీ యిచట నిచ్చెన ♦ వేసుకొని
మధ్యరాత్రిరి దిగునట ♦ మగువనెత్తు
కొని వెళ్ళవలెనటా ♦ కోమలాంగి
వ్రాసివేసిన దిటనుండు ♦ మోసమేమి॥

వ॥ ఇంక నేమి వ్రాసినదో చూచెద.

క॥ నేడే రమ్మని యున్నది
నాడే అమవాసచీక ♦ ఔను నిజంబే

చేడెను నెత్తుక వెళ్ళెద
పీడునునాదూ దరిద్రి ♦ కూడు నిజంబే॥

వ॥ శంకరా నీవెదిక్కునాకు లగ్గమే కాదనుకున్న మెల్లెగబోయి బంగులకిందకుబోయి కూర్చుండెద.

మౌన-వ॥ హా పరమేశ్వరా నాభర్తాలుండు చీటిలోవున్న వర్త మానము గ్రహించి మేడకిిందికి వచ్చి కూర్చుండవచ్చును యిదేసమ యము వెళ్ళుటయే ముఖ్యము.

గీ॥ నేడె నాభర్త కాగితము ♦ జాడదెలిసి
రాగలడు తోలునిచ్చెన ♦ రాజుపైన
జేరివెళ్ళిన తరువాత ♦ జయముగొందు
తల్లి వరలక్ష్మి దేవత ♦ దయయొసంగు॥

(తోలు నిచ్చెన పైనుంచివేసి దిగును)

జంగ-వ॥ ఓహో వచ్చుచున్నది భుజంబుపై నిడుకొని వెళ్ళెద గాక.

మౌన-వ॥ ప్రాణేశ్వరా వచ్చియున్నవా పదుము వెళ్ళుదము.

(మౌనధారిని భుజంబుపై నెత్తుకొని)

జంగ-గీ॥ మాటలాడంగ వలదు యీ ♦ మగువతోటి
మగడెయని భుజముపై నెక్కె ♦ మంచివనియె
దండ కారడవి కేగెద ♦ చెండిక్రుపచె
ప్రొద్దు బొడచిన తరువాత ♦ ముద్దులిడుదు॥

(కీ కారుణ్యంబును ప్రవేసించి)

జంగ-వ॥ ప్రాణేశ్వరీ నీకొరకై నిద్రాహారములులేక భ్రిమచే నిన్ను నాభుజముపై నిడుకొని వచ్చితిని ఒక ముద్దివ్వు.

దరువు - ఏక.

జంగ॥ చక్కనిపిల్ల కాంతి చుక్కాల చందుర్రిీరు । చక్కెరబొమ్మ లాగు చెలగుచుంటివే । యెక్కాడికేగెదావు । చిక్కితివి నాచెంత వొక్కా । ముద్దిచ్చిబోవు మోహానాంగిరో । కొట్టానుతిట్టాను కోపం బుమానావె । ముద్దొక్కటివ్వావె జేరూ నాచెంతాకు ॥చ॥

వ॥ ప్రాణేశ్వరీ వాక్కు ముద్దియ్యవే నాప్రాణి నిలచేటట్టు లేదు రమ్మా.

మాన-వ॥ హా పరమేశ్వరా కోమటివాని చెర దప్పించుకుంటిని గాని యీజంగమువానిబాధ యెట్లు దప్పించుకోవలయు వీనితో తగురీతి మాటలాడెదగాక.

అర్థసీసం - వాదము.

జంగ॥ మగువ నీవెవరోనీ మగడని భావించు ♦ వగ దలంచకు నీవు భాగ్యశాలి

మాన॥ కోమటి పాలి శెట్టి కోడలి నైమీతో ♦ శ్రమదోలంగను నాకు సౌఖ్యమబ్బె

జంగ॥ సఖినన్ను గూడుమీ వికల మొందకుమది ♦ కోరిన వస్తువుల్ కొదువలేవు

మాన॥ జంగమా వినువిడువ జాలనా దేహంబు ♦ దాహంబుచే తడబడగ దొడగె

గీ॥ జంగ॥ సఖియ యుదకంబు దెత్తును ♦ వికలమేల
మాన॥ ఇదుగో యీకనక పాత్రచే ♦ జలము దెమ్మ
జంగ॥ ఫలములును దెచ్చెదను వేగ ♦ భ్రాంతి దెలుపు
మాన॥ జలములును దెమ్మ ♦ శివశివా వేగ బామ్మ॥

వ॥ అయ్యో దాహముచే నాలుక తడబడుచున్నది యీపాత్రిగొనిపోయి వుదకంబును దెమ్మ నేనిచటనే యుందును.

జంగ॥ ప్రాణేశ్వరీ యిచటనే యుండుము ఉదకంబును దెచ్చువాడను.

(అని కనకపాత్రను దీసుకొని వెళ్ళును)

మాన-వ॥ ఈజంగమువాడు జలంబునకై వెళ్ళెను నేనిచట నుంటినా యేదో యొక మోసంబు జరుగును యీకీకారణ్యంబులో నెచటనైన దాగియుండెదగాక.



—(చోరులు ప్రవేశము)—

దర్వు - ఏక.

ఎఱ్ఱోడు॥ సారాయి మజాజూడరా । వోరికఱ్ఱోడా ॥సా॥ సారాయి పొట్లోన బారాబోసీనకండ్ల । వీరాస్వర్గంబుగనుపడూ । అందూకె నరులు వూరికె దాన్ని విడువరూ ॥సా॥

కఱ్ఱోడు॥ ఆసారనీకు యేమిదెలుసురా । వో రెఱ్ఱోడ । నిసాలోన యుంటెబాగరా । దిసాయించి పైసమనకు । దసాయించి దొరుకకుంటె దనుకుమాని మనను నొచ్చురా । పెండ్లామునైన । కసాయివాని కమ్మి తాగురా ॥పెం॥

ఎ॥ రిచ్చవాలె వార్లుతావురా । వోరికఱ్ఱోడా । కస్సపిస్సముచ్చటేందిరా । వోరికఱ్ఱోడ । దచ్చకూలుయెవ్వరేని వచ్చిచూచి రేనినీదు । మచ్చరంబడంచును పోరా । వూకుండుమంటె ॥రిచ్చ॥

క॥ కల్లబొల్లి మాటలేలరా । రాజక్కప్యాట । నల్లనీ సామీని దలువరా ॥ రాజ॥ కల్లురుచీ మరుగువాడు నల్లమందు తెరువుబోడు । నల్లమందు దిన్నచూడరా । కైలాసమంత । త్రుల్లిమసలిఆడుచుండురా॥ కై॥

క-వ॥ ఒరే ఎఱ్ఱోడా నీమాటలు సూత్తె మనకేదో మోసానికే వుందిరా.

ఎ-వ॥ ఒరే కట్టోడా యీరోజు మంచిది అమాస చీకటి మనకు ధనమబ్బుద్దిరా నేనురాంగ అల్లు మంచిగయుందిరా.

( మానధారిని జూచి )

క-వ॥ ఒరేవోరే యీపొదలేందో మెరుస్తుందిరా మాంకాల మ్మనా మా లక్ష్మమ్మనా వనదేవతనా సూడ్రా.

ఎ-వ॥ ఒరే దూరంగవుండి దండాల్ పెడుదాంరా.

వాదం - ఏక.

ఎ॥ దండమె వోకొమ్మ । యెండాలోవొంటరీగ ॥దం॥ నుండూట కారణంబు నూకూ దెలుపావెనాతో ॥దం॥

(మానధారి పొదలోనుంచి లేచి)

మాన॥ రాండీవోయన్నలార । దండమర్పింతు మీకూ ॥రాండీ॥ చండపతి సతునీసేవా । సేసెసాధులామయ్యా ॥రాం॥

క॥ ఎవ్వరలయి తెదేమి । యివ్వమనీపై సామ్మ । నవ్వాల మాటలేల నాతోడ బలుకబోకు ॥యె॥

మాన॥ ఔనూవోయన్నలారా । అడగినంతా ద్రవ్యంబూ । నివ్వ నే దలచినానూ । యింటికినను గొనిపోండీ ॥ఔ॥

ఎ॥ చెల్లెయని పిలుత్తాము । చేరూమాయింటికి । మెల్లంగ వచ్చి మాకు । మేలేమి శేత్తావె ॥చె॥

మాన॥ వినుడీ పాకంబుజేసీ । ఘనులార నొసగెదాను । దినమూ రాజక్కా-ప్యాట వనజోద్భవూని కృపచె ॥వి॥

వ॥ అన్నలారా మీకు మేలైన వంటలుజేసి పెట్టగలను నన్ను మీతోబుట్టు చెల్లెవత్తుగా భావించవలయును.

క-వ॥ ఒరే యెట్టోడా మనము చెల్లెయని పిలుత్తాముఠా మంచి మంచి వంటలుచేసి పెడుతాదిరా.

మాన॥ అన్నలారా మీరు చేయుపనులు బాగుగా చేయగలరు నేను వొకపని జెప్పెద చేయుడు.

గీ॥ అన్నలార నను బ్రోచెమా ♦ యయ్యలార
యిట్టిపురమున పొలిశెట్టి ♦ యింటిలోన

తురగమును నొక్క పెట్టె ♦ యుంచుంచినాను
వేగమేయిటకు రెండివో ♦ యన్నలార॥

వ॥ అన్నలారా కనకాపురి పట్టణములో కోమటి పాలిశెట్టి యింటిలో నొక అశ్వమును నొక బంగారి పెట్టెయును గలదు మీరు జాగ్రతగా బోయి దీసుకొని రండు మీరువచ్చునంతలో వంటజేయుదాన.

ఎ-వ॥ కట్టోడా తీసుకొత్తాం పదురా.

(అనిపోయి అశ్వమును పెట్టెను తెచ్చియిత్తురు)

మౌన॥ అన్నలారా మీరలు మహాజాగ్రతగలవాండ్లు కావున మీమీ పనులకు వెళ్ళుడు.

(దొంగలు వెళ్లుదురు)

మౌన-వ॥ ఇదియే సమయము నాభర్తాలుండు యెక్కు తురగమును బంగారి సందూక నాజే జిక్కినది వెళ్ళినదే ముఖ్యము నేనీ స్త్రీరూపము నొదలి పురుషవేషము ధరించి వెళ్ళెదగాక.

(అని పెట్టెలోనున్న భర్తాలుని వస్త్రాబులు వేసుకొని అశ్వంబుపై నెక్కి వెళ్ళును)

కోమ-వ॥ ప్రాణేశ్వరీ యెందుబోయితివి నాకొంపముంచి పోయితివా.

గీ॥ తరుణియశ్వంబు పెట్టెయు ♦ తల్లెనెటకొ
మోసపుచ్చియు పాయెరా ♦ దోసకారి
ద్రవ్యమునుబాయె దారిద్ర ♦ సమయమాయె
యిదుగొ సన్యాసి నయ్యెద ♦ యీశ్వరాజ్ఞ॥

వ॥ హాలింగా యెంత గతిదెచ్చితివిరాతండ్రి ద్రవ్యము బోయిన యాస్త్రీయైన దక్కకపాయెను లింగా నీవేదిక్కు.

(అని సన్యాసి వేషధారియై వెళ్ళును)

జంగ వ॥ ప్రాణేశ్వరీ మంచితీర్థం దెచ్చినానే యెందుబోయితివి మాటలాడవా హా దైవమా యెటకో వెళ్ళినది.

గీ॥ మోసిమోసియు భుజవంత ♦ నొప్పిబుట్టె
కోన టెదినన్ను యెంతలో ♦ మోసబుచ్చె
దైవమాయిక నేనేమి ♦ సేయువాడ
యెంత పనిజేసె సన్యాసి ♦ వింతజూపె॥

వ॥ ఈ తరుణికొరకై సన్యాసి వేషంబును ధరించి దేశాటనము చరించి చూచెనగాక. (అని సన్యాసి వేషంబుతో వెళ్ళును)



( మానధారి మగవేషముతో మాణిక్యపురి పట్టణంబుజేరి )

మా-వ॥ హా పరమేశ్వరా ఇన్ని యాపదలు దప్పించుకొని అశ్వముపైన గూర్చొని వెళ్ళివచ్చితిని యీ పట్టణము యెవరిదై యుండునో విచారించెద. (ఒక భటుని జూచి) ఎవరురా యీపట్టణము నామాంకితమేమి మీ రాజు నామాంకితమేమి తెల్పుము.

భటు-వ॥ అయ్యా యీ పట్టణము మాణిక్యపురిపట్టణము మా ప్రభు నామాంకితంబు మాణిక్యేంద్రుడు.

మాన-వ॥ ఈ రాజునకేమైన కొమారులు గలరా ?

భటు-వ॥ అయ్యా ఒక కుమారుండు గలడు ఆపిల్లడు సభలో మానముగాచే స్త్రీని వివాహమాడి వత్తునని పోయినవాడు ఇదివరకును రాలేదు.

మౌ-వ॥ యీపట్టణము మామామగారిదే సరే మంచిదేగాని మీ రాజునకు చెల్పుము ఒక చిన్న రాజు వచ్చి మన పట్టణమందు నిలచి మిమ్ముల రమ్మని యాజ్ఞాపించినాడని తెలిపిరమ్ము.

భటు-వ॥ తెలుపుటకేమి సందియంబు లేదుగాని శత్రుల బాధ మిక్కుటంబువలన రాజ్యభారంబు నొదలి గృహంబులో దుఃఖింపుచు నున్నవాడు. దర్వు - ఆట.

మౌన॥ ఏమి యాపదా గలిగెనయ్యామీ । గ్రామము జేరితిధర్మ పేరుడపని॥యేమి॥ కొడు కేయంచుననుబ్రోవుడికా।దుడుకులనిక నేద్రుంతు భూవర ॥కొ॥ పిడికెడంత సాదమెచాలును నే । దొడుగువస్త్రములుచాలిక మేలిక । ధరారాజకక్కపేటలో వెలయూ । హరియుగలడుమది చింతలు నొదులూ ॥యేమి॥

వ॥ అయ్యా నీకుమారుండు వచ్చువరకు నేనే రాజ్యభారంబు వహించువాడ శతృలు గీటడంచెద చింతవలదు.

మాణి-వ॥ సుకుమారా నీ నామాంకితంబేమి మీ రాజ్యమె య్యది నీవిచ్చటికి యేలవచ్చితివి.

మౌన-వ॥ అయ్యా తెలిపెద వినుము.

గీ॥ సప్తసాగరబాహ్య రత్నాకరంబు ♦ నగరిదొరపుత్రుడనునర నాయకుండ ♦ రాజ్యమునుతండ్రిస్థితిదప్పిరాష్ట్రమొదలి ♦ నెవరుమన్నించిబ్రోచిన స్తవము జేతు॥

వ॥ అయ్యా మాపురము రత్నాకరము మాతండ్రి రత్నాకరుండు శత్రులబాధచే మారాజ్యంబు వదలివచ్చినవాడ దేవా.

మాణి-వ॥ ఇచటగూడ శతృలుగలరు నీవెట్లు రాజ్యంబు పరిపాలింపగలవు. మౌన-వ॥ మీ కృపనున్నచో జయించగలను దేవా.

మాణి-వ॥ అటులైన యీ సింహాసనంబుపైన గూర్చుండుము.

(శత్రుడు విని వచ్చును)

శత్రు-వ॥ ఎవడో క్రొత్తరాజు వేంచేసినవాడట చూచెదగాక.

గీ॥ ముందుభయపడియీరాజు పందెమొడ్డె ♦ యెవడొరాబడె మొనగాడు వెనుకజోరక ♦ చిన్నదొరయైతె గాడుయీవన్నె దెలియు ♦ కాని చూచెద వీని ప్రతాపమేమొ॥

వ॥ ఒరే మానవా యీపురంబునకు నధిపతిననుకుంటివా నాతో పోరుసల్పుము రమ్మ.

మా-గీ॥ తులువనీతి నెరుంగక దూర నేల ♦ డాంబికపుకుక్క నను పురో డాళనంబె ♦ ఖలుడనీయుక్తులునుచాలు తొలగుమింక ♦ బ్రతుకు జీవమయనిపొమ్మ భయముబూని॥ దర్వు - ఏక తాళము.

మాన॥ మగతనమూనూర్కున్న । మగ వేషంబుబూని । యిపు డెటులైనగాని । వగపొందూటమాని ॥మిత్రి॥ జగము మెచ్చగ శత్రులను నామగనిక్రృపచే । హతము జేసెద । మగువయని తెలియంగ జాలరు । నగరనావలనన్ను గనుగొని॥మగ॥ (అశ్వముదగ్గర జేరి)తురగమనాదుదొర ప్రజ్ఞ సరగూనజూపు । పగవారిద్రుంతుచాపు । హరికరుణించుదాపు॥ మిత్రి॥ వెరువకనుదుర్జనసమూహము । లిరుగదొక్కుచు నెగురుమా యిక । నరికెదనునాబలముకొలదిగ । మురికికాల్వలుబార క్షోణిలో ॥తుర॥

వ॥ ఓ తురగమా నా ప్రతాపంబునకు నీబలంబు జూపింపవలయును. (కత్తి చేబూని అశ్వంబుపైన గూర్చొని)



దర్వు - ఆటతాళము.

మా॥ ఔరనరాధమా । యెవరెవరోరండురండు ॥ఔ॥ మానూలరీతినున్న మాదొరచెంతజేరి । దవిలీరయుద్ధంబు । ధర్మంబుదప్పబోకు ॥ ఔ॥ పటుపటురయుద్ధమూ । పారిపోకుసిద్ధమూ । తృటిలోమీాదండునంత మటుమాయముజేసెదాను ॥పటు॥ (శత్రుల బారదోలును)

సీ॥ భటులారయీా పురిపాలించుదొరనునే ♦ కనకాంగుడనునామ మనుడిజనులు ♦ నొకస్త్రీనిదోలింతు సఖతీరుచిత్తారు ♦ వ్రాసియా బొమ్మను మోసమనక ♦ నెవరు ప్రతిమనుజూచియు నేడ్వసాగ ♦ వారలను పట్టికోట్టుటె వాంఛయిదియు॥

వ॥ ఒరే భటులారా ఇచ్చట అన్నసత్రము గావించవలయును నేనొకస్త్రీని దోలించగలను ఆస్త్రీని రూపపటములో దించి సత్రమందు గట్టవలయు ఆ పటమును జూచి దుఃఖించిన వారల నావద్దికి దెమ్ము.

(అని వెళ్ళి స్త్రీరూపము జూపించును)

భటు-వ॥ అమ్మా నీరూపపటము యిందు దించుకొని యుంటిని పొమ్ము. (మగవేషముతో వచ్చి)

మూన-వ॥ ఒరే భటులారా దించుకొని యుంటిరా సత్రము యెదుట గట్టుడు ఇచ్చట అన్నదానము జరుగబోవుచున్నదని చాటించుడు—

భటు-వ॥ ఓహో యీా మాణిక్య పురమందు అన్నదానంబు జరుగ బోవుచున్నది యెట్టివారలేకాని రావలసినది.

(కోమటి సన్యాసి వేషముతో)

కోమ-వ॥ అయ్యో దైవమా దేశాటనమంత తిరిగితిరిగి వేసారితి ఆకలి దప్పికి నోర్వజాలకుంటి అయ్యో దైవమా ఎచటనో భేరీవినవచ్చె.

గీ॥ మాణిక్యపురమందుమహిపతులునుపుణ్య ♦ సత్రంబుబెట్టిరనిచాలవింటి కోమటికులజాతి నేమంబునొదలితీ ♦ సన్యాసినయ్యెద కన్యకొరకు॥

(సత్రము చెంతజేరి)

వ॥ ఆహా నన్ను మోసపుచ్చి యీా సత్రముయందు బొమ్మవై నెరసితివా రమ్మా ఒక ముద్దివ్వుము, వాదం – దర్వు – ఆది.

కోమ॥ నారివరలక్ష్మివ్రతమూనికొంతా । చూర బుచ్చితివెనా ద్రవ్యమంతా ॥నారి॥ జేరియుటనిలచినవ ముద్దుగుమ్మా । దిగుదిగావె బంగారుబొమ్మా ॥నారి॥ ( భ టు డు జూ చి )

భటు॥ ఓరీయెవ్వడవురనిలువుసన్యాసీ । దూరితివిమాదు దేవతను జూచీ వోరీ॥ (పట్టుకొనిపోయి రాజువద్దికి గొనిపోయి) ప్రభువు నెవడో సన్యాసిదిగో పటమురా । పరిశీలించి నేడ్వగ తాళజాలరా ॥ప్రి॥

మౌన॥ శుభమె సంకెళ్ళు వేయించి సాధురా ॥శుభ॥ నభయమిదె కారాగృహములోదోలురా ॥శుభ॥

వ॥ ఒరే భటులారా వీని కాళ్ళుచేతులకు సంకెళ్లువేసి కారాగృహంబులో వేయుడు.

భటు॥ పదర బంధిఖానలో తోలెదానూ । ప్రభువుయాజ్ఞయుసదిపుడు సమయామూ ॥పదర॥

వ॥ ఒరే సన్యాసీ నడువుము కారాగృహంబునకు

(కారాగృహంబులో వేయును) (జంగము ప్రవేశించును)

జంగ-వ॥ లింగా యెంతపని జేసితివిరా తిరిగి తిరిగి నా దేహమంత కృశించి పోయెను యెచటనో భేరి వినవచ్చె అచటికి బోయిన బుక్కెడు ప్రసాదము దొరుకదా.

(అని సత్రిము చెంత జేరి సత్రంబుపైకి జూచి)

జంగ-వ॥ ఓహో నన్ను మంచితీర్థము దెమ్మని మోసపుచ్చి వచ్చి యిచ్చట బొమ్మవై నిలచితివా రమ్మి దిగుదిగు. దర్వు-ఏక.

జంగ॥ సత్రంబుపైనవొక్క చిత్రంబుగలదుహా । ధాత్రిలోనభుజమెక్కిన తరుణి పటముజూచితీ ॥స॥ నేత్రమూలు విప్పరావు నెలతరానె తాళనూ । క్షేత్రిమొదలిసన్యాసినైతి చెలియనీపై భ్రాంతిచే ॥స॥

వ॥ ప్రాణేశ్వరీ దిగుదిగు ఒక ముద్దివ్వవే.

భటు-వ॥ ఒరే సన్యాసీ నడువుము మారాజువద్దకు.

(అని పట్టుక పోవును)

మౌన-వ॥ భటులారా యీ ముక్కిడి జంగమువాన్ని సంకెళ్ళు వేసి చెరసాలలో వేయుడు. (చెరసాలలో వేతురు)

(దొంగలు ప్రివేశింతురు)

ఎ-వ॥ ఒరే కట్టోడా యెన్ని దేశాలు తిరిగినా మన చెల్లెజాడ దొరకక పాయెగదరా యిచట యెవరో అన్నదానం చేస్తున్నారట పోదాందారా బుక్కెడంత అన్నమైన దొరుకదా.

క-వ॥ ఒరే కట్టోడా యిదేమి శిత్రము యీసత్రమందు యేమో కనుపడుతుంది చూరా మన చెల్లెకాదటా. దర్వు - ఏక.

ఎ॥ అంగనపటమూట్టకట్టోడ సత్రమందున నిలచినాది కట్టోడ। యెంగిలి కూడన్న యెయ్యె మాయవ్వో నీముంగీటనిలచినామె మా చెల్లె। విడచిపోను। విడచిపోను॥అం॥

క-వ॥ ఒరెరే యెట్టోడా మనకు వంటజేసి పెడుతనని యెల్లొచ్చి యిక్కడ బొమ్మయ్యి నెరిశిందిరా చెల్లే దిగుదిగు.

భటు-వ॥ ఒరే పదువ్వుము మారాజువద్దికి (అని తీసుక పోవును)

మాన-వ॥ భటులారా వీరలకు యిప్పటినుంచి ప్రసాదంబునునొసంగుడు.

భటు-వ॥ దేవా చిత్తము.

(మన్మథుడు సన్యాసి వేషముతో ప్రవేశించును)

మన్మ-వ॥ హా దైవమా దేశాటనమంత చరించితిని యెచటనైన నా ప్రాణేశ్వరిజాడ దొరుకదయ్యె యిచట నెవరో అన్నదానమును జేయుచున్నవారట అటకుబోయిన యింత ప్రసాదమయిన దొరుకదా అచ్చటికి బోయెదను. దర్వు - రూపకము.

మన్మ॥ జననిజనకూలెందు జనిరో। వనితబాయె రాజ్యమేదో। దినకరకులజులకిట్టిఘన యాపదలు గలుగనేల॥జనని॥

(సత్రము చెంతకు జేరి పటమునుజూచి)

వ॥ హా ప్రాణేశ్వరీ మానధారీ.

మానవతీ। మాటలాడవ। మానధారీ నిలచితివ। పూనియిచట దేవతవయ్యి। స్థానమందు జేరితివా॥మా॥

వ॥ ప్రాణేశ్వరీ నన్ను మోసపుచ్చి యిచట దేవతవై నిలచితివా మానధారీ రమ్మ. (అని యేడ్వగ భటుడుజూచి)

అర్ధసీసం - వాదము.

భటు॥ సరెనయ్యసన్యాసి సఖిపటము వర్ణించ ♦ మేలిక రాజేంద్రు జోలిగనియు

మన్మ॥ మీ రాజునకునాదు మేలుయేమనియందు ♦ యిచటి నుండియు నేను యటకు రాను

భటు॥ భూవరాపిచ్చి భాసుర సన్యాసి ♦ పటముజూచియు నేడ్చె భార్యయంచు

మాన॥ స్నానంబు జేయించి చలువ వస్త్రములిచ్చి ♦ మూడు వేళలసాద మొసగిబోవు

భటు-వ॥ అయ్యా సాధుపుత్రా స్నానం బాచరించి నూతన వస్త్రంబుల ధరించి సింహాసనమందు వసించుడు.

మన్మ-వ॥ చిత్తము. (అని కూర్చుండును)

మాన॥ సాధుపుత్రా ఇచట నొక చిత్రమైనపని జరుగబోవు చున్నది తాము పరిశీలించవలయును.

మన్మ-వ॥ చిత్తము వినుచుండెది.

మాన-వ॥ ఒరే భటులారా చెరసాలలోనున్న కోమటిని జంగ మును రావించుము.

భటు-వ॥ దేవాచిత్తము (కోమటి జంగము యిద్దరును ప్రవేశింతురు)

మాన-వ॥ ఒరే కపటమానవులారా యీ పటమునుజూచి దుః ఖించుటకు కారణమేమి తెల్పుడు లేకున్న శిక్షవిధింపబడును.

కోమ-వ॥ అయ్యా ఒక బాటసారి చీరరవికెల తీసుకొని నావద్ద కుదువగానుంచెను ఆచీరరవికెలజూచి ఆశ్చర్యమునొంది యీచీరగట్టె స్త్రీ యెంత సౌందర్యముగలదోయని చీరరవికెల నానవాలుగాబంపించి ఆస్త్రీనిదెచ్చి నాగృహంబులో నుంచుకొనగ వరలక్ష్మీవ్రతమని నాద్ర వ్యమంత చూరబుచ్చి యెక్కడనో వెళ్ళెను యాస్త్రీకొరకై సన్యాసినై చరించుచురాగ నిచట కనుపడి యేడ్చితిని.

మాన-వ॥ ఇంతియేన మరి యేమయిన అంటివా.

కోమ-వ॥ ఇక యేమియు ననలేదు.

మా-వ॥ జంగమా నీవెందులకై పటమునుజూచి యేడ్చితివి.

జంగ-వ॥ అయ్యా నిత్యము భిక్షాటనకైబోవుచుంటిని ఒకనాడు సాహుకారి యింటిముందర నొక కాగితము దొరికెను ఆకాగితము చూ డగ అర్ధరాత్రి తోలునిచ్చెన వేసుకొని దిగివస్తున్నానని వ్రాసినందు లకు నేబోయి మేడక్రింద కూర్చుండియుంటిని అర్ధరాత్రి దిగిరాగ భుజ ముపై నిడుకొని అరణ్యమునకు గొనిపోయితిని.

మాన-వ॥ అరణ్యంబులో యాస్త్రీని యేమనియుంటివి.

జంగ-వ॥ ఏమియులేదు దప్పిచే నాలుక తడబడుచున్నదని త్రైలు

పగా నీరుకై వెళ్ళితిని మళ్ళి వచ్చువరకు నెటకో వెళ్ళిన యాస్త్రీ లేక పాయెనని సన్యాసినయ్యి దేశాటనము చరించగ నిచట గనుపడినందు లకు దుఃఖించితిని.

మౌన-వ॥ ఒరే చోరులారా మీర లెందులకై దుఃఖించితిరి.

చోరు-వ॥ అయ్యా మేము దొంగతనానికి వెళ్ళుతుండ కారడవిలో యీతల్లి యగుపడినది అమ్మా మీరోలంటే మేం సాధులమని చెప్పింది అయితెగాని నీసొమ్మంత యివ్వమని బాధించితిమి బాధించగా అన్నయ్యలారా నేనే మీగృహంబునకు వస్తానని మాయింటికచ్చి మీకు వంటచేస్తనని చెప్పి యీగ్రామంలో పొలిశెట్టియింట్ల ఒక అశ్వమును బంగారి సందూకయు గలవు అవి తెమ్మనగ తెచ్చి యిచ్చితిమి తర్వాత మేము దొంగతనానికిపోయి మళ్లి వచ్చేవరకు గుఱ్ఱముబంగారి సందూక మాచెల్లె తీసుకొని యెక్కడికో వెళ్ళింది మేము మాచెల్లె కొరకై సన్యాసులమై తిరుగగ నిచట నగుపడి యేడ్చితిమి.

మౌన- వ॥ ఒరేభటులారా వీరలను యిటుల విచారించితే చెప్పే ట్టులలేదు వీరలకు తగురీతి శిక్ష విధించవలయును.

క॥ కర్లినుపై దెప్పించియు ♦ పొర్లించుడియగ్నియందు పొగలెగయంగా
బర్లకు వాతలుగుంజెటి ♦ కొర్లనుపై బెట్టుడిపుడు కొరగాకుండా॥

(కోమటి జంగము దొంగలు)

వ॥ అయ్యా మమ్ములను బాధింపనేల యింతకుమిక్కిలి యేమిలేదు.

మౌన-వ॥ సాధుపుత్రా మీరెందుకై దుఃఖించితిరి.

మన్మ-వ॥ అయ్యా నేను బడిలో విద్య నభ్యసించుచుండ మా నాయనగారు నాకు వివాహము చేయుదలంచి నన్ను విచారించగ నేను వివాహ మాడనని చాల బ్రతిమాలితిని మా నాన్నగారి యాజ్ఞ మీర గూడదని సభలో మౌనముగాచే స్త్రీని వివాహమాడెదనని దేశాటనము బయలుదేరి మాణిక్యపురమునుండి వెళ్ళి రత్నాలపురిజేరి మౌనధారిని వివాహమాడి మా పట్టణమురాగ శనిబాధచే చిక్కిలి క్షుధబాధచే కనకాపురంబుజేరి ఒక కోమటివద్ద చీర రవికెల కుదువయుంచి సాయిత్యము తీసుకొని వచ్చేవరకు నాభార్య అశ్వము బంగారి సందూక

లేనందున దుఃఖించి సన్యాసినై దేశాటనము చరించుచు రాగాయీ సత్రిమునందు అబిడ్డ ప్రతిబింబపత మగుపడినందున దుఃఖించితిని.

మాన-వ॥ సాధుపుత్రా యింతమంది చేతులనుండి తప్పించుకొని వెళ్ళినస్త్రీని మగడు బట్టవచ్చునా.

మన్మ క॥ పతివ్రతయు సత్యశీలయు ♦ మతిజెడి దుర్మార్గవృత్తి మగువయుగాకే ♦ యితరుని మదిదలచనియా ♦ సతిసుమి తన పురుషముగల గూడ సౌఖ్యము గలుగున్॥

వ॥ ఆస్త్రీని మహా పతివ్రత యనవచ్చును ఆమెమగడు చేపట్ట వచ్చును.

మా-వ॥ నీభార్యను జూపించెద చేపట్టెదవా.

(అని లోనికిబోయి స్త్రీరూపముతో వచ్చును)

వాదం—దర్వు-ఏక.

మన్మ॥ మానధారీనను మరచెట్టులుంటివమ్మ । మానిని సభలో నాదు మానము గాచీన । జ్ఞానరత్నమ అనుమాన మొందితివమ్మ॥

మాన॥ మాన వేంద్రానను మరచెట్టులుంటిరయ్య । శ్రీనివాసున్ని కృప బూనియు వెతలుమానె । మానావమానములసమానములగా నేలి॥

పునర్వివాహము - తదేవలగ్నము.

మంగళహారతి.

నీరాజనంబిదె శౌరీ । ఘోరాజనితకలుషారీ । క్షీరాబ్ధి వరసుత ధారీ । పారావారవిహారీ ॥నీ॥ పక్షీంద్రగమన విరాజ । రక్షించురవికుల తేజా । వీక్షించుదీనసురభూజా శిక్షించుదుష్టులనురాజా ॥నీ॥ ధరశ్రీ రాజకృప్యాట । వరదా శ్రీవేంకటేశా । కరుణించుమిక చిద్విలాసా । కమనీయరుచిరసువేషా॥నీరాజనంబిదె॥

మానధారి నాటకము - సంపూర్ణము.




కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె, సికింద్రాబాదు.

## శ్రీయుత చెర్విరాల భాగయ్య కవిగారిచే
## రచియింపఁబడి, ప్రసిద్ధి వహించిన
## యక్షగానములు. ప్రతి 1 కి రూ 0-12-0

—)*♦*(—

సుగ్రీవ విజయము
(మహబూబాద్ పై అంకితముగలది)

కనకతార చరిత్రము
(వడ్డెపల్లిపై అంకితముగలది)

కాంతామతి చరిత్రము
(వడ్డెపల్లిపై అంకితముగలది)

సత్యభామా పరిణయము
(వడ్డెపల్లిపై అంకితముగలది)

జయంత జయపాలము
(వడ్డెపల్లిపై అంకితముగలది)

శ్రీకృష్ణ రాయబారము
(వడ్డెపల్లిపై అంకితముగలది)

మాధవ చరిత్రము
(వడ్డెపల్లిపై అంకితముగలది)

సత్యహరిశ్చంద్ర
(మహబూబాద్ పై అంకితముగలది)

సారంగధర చరిత్రము
(మహబూబాద్ పై అంకితముగలది)

శ్రీకృష్ణ తులాభారము
(మహబూబాద్ పై అంకితముగలది)

ఆరెమరాటీల చరిత్రము
(మాధాపురముపై అంకితముగలది)

బభ్రువాహన చరిత్రము
(మహబూబాద్ పై అంకితముగలది)

మార్కండేయ విలాసము
(గుమ్మడిదాలపై అంకితముగలది)

నాగార్జున చరిత్రము
(బీరంగూడెంపై అంకితముగలది)

కాంభోజరాజు చరిత్రము
(మహబూబాద్ పై అంకితముగలది)

పుండరీక చరిత్రము
(చింతలచెర్వుపై అంకితముగలది)

మాయా సుభద్ర విలాసము
(మాధాపురముపై అంకితముగలది)

సైంధవ పరాభవము
(మాధాపురముపై అంకితముగలది)

తారకాసుర వధ
(గుమ్మడిదాలపై అంకితముగలది)

గరుడోపాఖ్యానము
(మహబూబాద్ పై అంకితముగలది)

నోటు:— ఇవిగాక యింకా మీకు కావలసిన పుస్తకములకు

# కొండా శంకరయ్య
## బుక్‌సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్
## సికింద్రాబాద (దక్కన్)

(అని వ్రాయుడు.)